# హస్తామలక స్తోత్రము–1

కస్త్వం శిశో కస్య కుతోఽసి గన్తా
కిం నామ తే త్వం కుత ఆగతోఽసి
ఏతద్వద త్వం మమ సుప్రసిద్ధం
మత్ప్రీతయే ప్రీతివివర్ధనోఽసి.

తా॥ శ్రీ శంకరభగవత్పాదులవారు హస్తామలకుడను బాలుని ఇట్లు ప్రశ్నించిరి– ఓ పిల్లవాడా! నీవెవరవు? ఎవరి పుత్రుడవు? ఎక్కడనుండి వచ్చినావు? ఎక్కడికి వెళ్లుచున్నావు? ఈ విషయములన్నిటిని నాయొక్క ప్రీతి కొఱకు తెలియ జేయుము.

వ్యాఖ్య :– పూర్వము ఒకానొక తల్లి తన మృతశిశువును గూర్చి విలపించుచుండగా ఒక సాధుమహాత్ముడు ఆమెకు ఆనంద మొనగూర్చు నిమిత్తము ఆ మృతశరీరమందు ప్రవేశించెను. పుత్రుడు బ్రతికెనని తల్లి చాల సంతోషించెను. కాని ఆ పిల్లవాడు జడత్వమును దాల్చియుండ, భూత ప్రేతములావహించెనని భావించి తల్లిదండ్రులాతనిని శ్రీ శంకర భగవత్పాదుల యొద్దకు తీసికొని వచ్చిరి. శంకరులా బాలుని ఈ ప్రకారముగ ప్రశ్నించిరి. అందుల కతడు చక్కని ప్రత్యుత్తరమిచ్చెను. తాను జడమైన దేహము కాదనియు, సర్వకాల సర్వావస్థలయందును తేజోవంతమై యలరారు నిత్యశుద్ధ బుద్ధముక్త ఆత్మయే తాననియు అతడు చెప్పెను.

(ఈ విషయములన్నియు రాబోవు శ్లోకములందు వివరింపబడగలవు.)

ఓం

# శ్రీ శుకబ్రహ్మాశ్రమము

# వేదాంతభేరి

| సంపుటము : 24 | నవంబరు 1992 | సంచిక 11 |
|---|---|---|


## సంపాదకవర్గము





| | |
|---|---|
| సంవత్సర చందా : | రూ. 30/–లు |
| పంపవలసిన అడ్రసు : | మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము<br>అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట<br>పి.బి.నెం.323, విజయవాడ–520 002<br>ఫోన్స్ : 61862, 64017, 72433<br>Telex : 0475 362 ANIL Fax : 0866-63017 |
| శాశ్వత చందా : | రూ. 300/–లు. |
| పంపవలసిన అడ్రసు : | 'వేదాంతభేరి శాశ్వతనిధి'<br>శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము<br>పోస్టు, శ్రీకాళహస్తి–517 640<br>ఫోన్స్: 2239,2543 STD Code 085 78 |


చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా నంబరు తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో వచ్చు 'వేదాంతభేరి' కవరుపైయుండును.

# వేదాంతభేరి

**అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక**

**BE FEARLESS : నిర్భయులై యుండుడు!**

## విషయసూచిక



**: ముఖచిత్రము :**

సర్వవిద్యాస్వరూపిణీ!

సకలవేదవినుతా! అక్షరగానరూపిణీ!

నిఖిల కళానిధానా! దేవీ! సరస్వతీ జననీ!

మనసా వాచా శిరసానమామి

# ప్రార్థన



## దైవ ప్రార్థన

సకలభువనబీజం భాతి యత్స్వస్వరూపం
అఖిలమజమఖండం కారణం బ్రహ్మతత్త్వమ్
ప్రణవమయమచిన్త్యం ప్రాణినాం దేహసంస్థం
ప్రకృతివిలయరూపం దేవదేవం నమామి.

సమస్త బ్రహ్మాండములకు మూలకారణమైనదియు, సకల జీవులయొక్క స్వస్వరూపమై భాసించుచున్నదియు, సర్వవ్యాపకమైనదియు, జన్మరహితమైనదియు, అఖండమైనదియు, సర్వమునకు కారణమైనదియు, ప్రణవస్వరూపమును, చింతింపనలవికానిదియు, సమస్త ప్రాణికోట్ల దేహములందుండునదియు, ప్రకృతిరహితమైనదియు, బ్రహ్మతత్త్వమై భాసిల్లునదియునగు దేవదేవస్వరూపమైన పరమాత్మకు నమస్కరించుచున్నాను.

ఓం

1992



"We want shraddha". We want faith in our own selves. Strength is life, weakness is death. 'We are the Atman, deathless and free; pure, pure by nature. Can we ever commit any sin? Impossible! Such a faith is needed.

మనకు శ్రద్ధ చాల అవసరము. మనయందు మనకు విశ్వాసము వుండవలెను. బలమే జీవితము. దుర్బలత్వమే చావు. మనము సహజముగనే నాశ రహితమగు, మృత్యురహితమగు, బంధరహితమగు, సర్వ స్వతంత్రమగు, మహోపవిత్రమగు ఆత్మ స్వరూపులము. అట్టి మనము పాపము చేయ గలమా? అసాధ్యము. అటువంటి శ్రద్ధ, అటువంటి విశ్వాసము మనకు కావలెను.

OO

# ఆధ్యాత్మిక వికాసము

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



భక్తి యున్నవారికి భగవద్దర్శనము లభించ గలదు. దర్శనమే కాదు, ప్రవేశము కూడా లభించగలదు. అనన్య భక్తిచే దేవుని తెలిసి కొనుట, దేవుని చూచుట, దేవునియందు ప్రవేశించుట అనునీమూడున్ను సంభవింప గలవని గీతాచార్యుల యభిమతము.

ష్టుం చ పరంతప' ఈ శ్లోకమునందు సాధకుని పారమార్థిక క్రమవికాసము లెస్సగ చిత్రింపబడినది.

ప్రారంభమున శాస్త్ర గురువాక్యముల ద్వారా సాధకుడు భగవంతు డెట్టివాడో తెలిసికొనును. అత్తఱి భగవంతుని చేరుటకు భక్తుడు తన ఆధ్యాత్మిక యాత్రను ఉపక్రమించును. ఉపక్రమించెనే కాని దేవుని ఇంకను సమీపించలేదు. కావుననే వారిని తెలిసికొనుట సంభవించెనే కాని చూచుట సంభవించలేదు.

ఈ స్థితిలో భగవంతుడు వేఱు, భక్తుడు వేఱుగ నుండును. భక్తి మాత్రము కుంటుబడకనుండును.

కాని ఇట్టి స్థితి చాలదు. సాధనను, భక్తిని తీవ్రతరమొనర్చి ఇంకను ముందునకు కొనసాగిపోవలెను. ఇట్లు చేయుచుండ చిత్త పరిపక్వత ననుసరించి కొంతకాలమునకు దేవుని అతి సమీపమునకు వచ్చును. దేవుని స్పర్శించును. దేవునితో మాట్లాడును. దేవునిలో తానొక భాగముగా (అంశముగా) తయారగునంతటి దశకు వచ్చును. అత్తరి దేవుని తెలిసి కొనుట అను స్థితిని దాటినవాడై దేవుని ప్రత్యక్షముగ (face to face) చూచునట్టి స్థితికి వచ్చును. (ద్రష్టుం) ఇది మాధ్యమిక దశ. విశిష్టాద్వైత స్థితితో దీనిని పోల్చవచ్చును. అయితే ఇదియును చాలదు. దేవుని చూచుట మాత్రముతో సంతుష్టిపడక దేవునిలో ప్రవేశించుటకై ప్రయత్నింపవలెను. (ప్రవేష్టుం) ఇది చరమస్థితి. అభ్యాస వశమున సాధన యొక్క తీవ్రతచేత, భక్తియొక్క పరాకాష్ఠచేత ఇట్టి సాక్షాత్కారదశ జీవునకు లభించగలదు. దేవుని ఎంతగా తెలిసికొనినను ఎంతగా చూచినను, దేవునిలో ప్రవేశించినంతటి ఔన్నత్యదశ అవుడు వానికి వుండదు. దేవుడు, తాను వేరుగా యుండుట పూర్ణస్థితి కానేరదు.

కావున దేవునిలో ఐక్యమైపోయినవుడే, దేవునియందు ప్రవేశించినవుడే పూర్ణనిర్భయత్వము, పూర్ణానందము జీవునకు సంప్రాప్తించగలవు. ఇదియే అద్వైతస్థితి. ఈ ప్రకారముగ గీతాచార్యులు "జ్ఞాతుం, ద్రష్టుం, చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప" (11–54) అను ఈ మహోన్నత వాక్యము ద్వారా లోకమునకు ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతములను మూడిటిని ప్రతిపాదించి ఒక్కొక్క మెట్టు పైకి పోయి తుదకు భగవంతునిలో ప్రవేశించుటయను చరమాద్వైత స్థితిని సర్వులును పొందులాగున ఆదేశించిరి.

అట్టి పరిపూర్ణ అద్వైత స్థితియందే జీవునకు సర్వదుఃఖములున్ను శమించిపోయి పరమానంద ప్రాప్తి కలుగును. అత్తఱి ఇక మానవుడు

మానవుడుగా నుండడు. మాధవుడుగా మారిపోవును. వ్యష్టియందు విలీనమై సమష్టి రూపముగనే శేషించును. ఉప్పుకల్లు సముద్రములో ప్రవేశించి సముద్ర రూపముగనే పరిణతమగునట్లును, అగ్నియందు ఆహుతి ప్రవేశించి అగ్ని రూపముగనే మారునట్లును, జీవుడు పరమాత్మ యందు ప్రవేశించి పరమాత్మ రూపముగనే చెన్నొందును. కాబట్టి సాధకుడు దేవుని తెలుసుకొనుట మాత్రముతో సంతుష్టిపడక, చూచుట మాత్రముతో తృప్తిపడక, ఇంకను పైకిపోయి, దేవునిలో ప్రవేశించి తానే దేవుడై ఇక విశ్రాంతి నొందవలెను.

ఒక మామిడిపండు కలదనుకొనుడు. అది ఇంటివద్ద లేదు. బజారులో యున్నది. దాని రుచి, రూపురేఖలను గూర్చి ఎవరో చాల గొప్పగ చెప్పగా విని తెలుసుకొని ఆనందించితిమి. ఇది మొదటి దశ. వినుట మాత్రముతో, తెలుసుకొనుట మాత్రముతో తనివితీరనందున వెంటనే బజారుకు పరుగెత్తి దానిని కొని ఇంటికి తెచ్చినాము. తెచ్చి దానిని ఎదురుగ పెట్టుకొని దాని అందచందములు చూచి ఆనందపడుచున్నాము. ఇది రెండవ దశ. అంతటితో మనస్సు ఆగక ఒక కత్తి తెచ్చి దానిని కోసి లక్షణముగ ఆరగించినాము. ఇక ఆ పండు బయట లేక మనలో ప్రవేశించినది. పండు, మనము ఒకటైపోయినాము. దాని మాధుర్యముచే పరమానందమనుభవించినాము. ఇది మూడవ దశ.

మొదటి రెండు దశలు దాటి మూడవ దశ వచ్చినపుడే ఆనందము యొక్క పరాకాష్ఠ చేకూరును. అట్లే దేవుని మొట్టమొదట తెలుసుకొని తదుపరి ప్రత్యక్షముగ చూచి ఆ పిమ్మట వారిలో ప్రవేశించి 'జ్ఞానీత్వాత్మైవ మే మతమ్' అనునట్లు భక్తుడు భగవంతుడు ఒకటైపోవలెను. అపుడే 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మమును) అని గుండెపై చేయివేసి ధైర్యముగ చెప్పగలుగును, అపుడు కలుగు ఆనందము వర్ణనాతీతము. ఆ ఆనందమే తానైపోవును. ఆనందఘన స్వరూపుడై విలసిల్లును. ○○

# మంత్రపుష్పము

'సాహిత్యప్రియ'

శ్రీ పంతుల వెంకటరామారావు గారు

1. ఎవని యిచ్ఛచేత నిలజీవరాసులు
పుట్టిపెరిగి తిరిగి గిట్టుచుండు
ఎవనిలోన విశ్వమేకమై యుండునో
నట్టి యాదిదేవు నాశ్రయింతు.

2. పంచతన్మాత్రలం బుట్టి ఆకృతి బరగు
త్రిగుణధాతుజమూర్తియై దివియు నెవడు
ఆది మధ్యాంతములు లేని యట్టివాని
భక్తియుక్తుల నేజేతు ప్రార్థనంబు.

3 జలజ ఖేచర భూచర జన్మకర్మ
విశ్వనాటక రంగము వెల్గజేయు
దర్శకుండగు పరమాత్మ దర్శనంబు
భక్తిమైగోరి నేజేతు ప్రార్థనంబు

4 నిర్గుణుఁడు నిస్సంగ నిర్మలుండు
సర్వభూతాత్ము డీశుడు శాశ్వతుండు
ప్రణవనాద రసామృత పానరతుని
భక్తియుక్తుల నేజేతు ప్రార్థనంబు.

# నామసంకీర్తన



శాన్తి దాన్తి భూషణాయ । శత్రుగర్వ శోషణాయ
మోహ బంధ ఛేదనాయ । సర్వలోక ప్రస్తుతాయ
సర్వదేవ వందితాయ । సుప్రసన్న వీక్షణాయ
బ్రహ్మతేజ శోభితాయ । వేదశాస్త్ర పండితాయ
అంజనా తపఃఫలాయ । అష్టసిద్ధి సంభృతాయ
ఆత్మయోగ తత్పరాయ । రామనామ భావనాయ
నమ ఆంజనేయా । నమ ఆంజనేయా

జయ జయ రాఘవ జానకిరామా । జయ రఘు నందన రాథేశ్యామా॥
నిర్మలరూపా జానకిరామా । నిగమస్వరూపా రాథేశ్యామా
పాపవినాశక జానకిరామా । ధర్మ ప్రబోధక రాథేశ్యామా
మోహ విభంజక జానకిరామా । మోక్షప్రదాయక రాథేశ్యామా॥

జయపాండురంగ ప్రభో విఠలా । జయవిఠలా జయవిఠలా
పాండురంగా విఠలా । పండరినాథా విఠలా॥



### అగస్త్య ఉవాచ

**నిమిషం నిమిషార్ధం వా ప్రాణినాం విష్ణుచిన్తనమ్**
**క్రతుకోటి సహస్రాణాం ధ్యానమేకం విశిష్యతే.**

**నిమిషముగాని, అరనిమిషముగాని భగవంతుని ధ్యానించుట యను నది కోట్లకొలది యజ్ఞము లాచరించుట కంటెను శ్రేష్ఠతమమైనది.**

# మహాత్ముల ప్రబోధము

## వివేకానందస్వామి

1. దేవునియందు భక్తిశ్రద్ధలు గలిగియుండుడు. నిష్కపటియు, విశ్వాస పాత్రుడును అయిన ఒక్కని నాకొసంగుడు. విశ్వాసహీనులైన అనేకులు నాకక్కఱలేదు. మీరెవరియొక్క తోడ్పాటుకొఱకును అఱ్ఱులు చాచవలసిన పనిలేదు. మానవులందఱి సహాయముకంటెను భగవంతుడు అనేక రెట్లు అధికుడు కదా! కావున పవిత్రులైయుండుడు. భగవంతునియందు పూర్ణవిశ్వాసముంచుడు. వారిపైననే నిరంతరము ఆధారపడియుండుడు. అపుడే మీరు సరియైన పంథా త్రొక్కినట్లగును. అత్తఱి మిమ్ముల నేదియు జయింప సమర్థము కాజాలదు.
2. ఎంతవఱకు ఆత్మశక్తి, దైవభావము భారతదేశమునకు వెనుక ఆధారభూతముగా నిలబడియుండునో, ఎంతవఱకు భారతదేశ ప్రజలు ఆధ్యాత్మికతను, దైవ దృష్టిని విడనాడకయుందురో, అంతవఱకు భారతదేశము అచ్ఛేద్యమై అమరస్వరూపమై కలకాలము విలసిల్లగలదు!
3. ఈ భౌతిక ప్రపంచమునగాని, ఆధ్యాత్మిక ప్రపంచమునగాని భయమనునది పతనమునకును, పాతకమునకును తప్పక కారణభూతమై యున్నదనుట పరమసత్యము. భయమే దుఃఖమును గలుగజేయుచున్నది. భయమే మృత్యువునకు హేతుభూతమగుచున్నది. భయమే కీడును జనింపజేయుచున్నది. ఇట్టి భయమునకు కారణమేమి? తన (ఆత్మ) స్వరూపమును తానెఱుఁగకుండుటయే. మనలో ప్రతివారున్ను చక్రవర్తులందఱికిని చక్రవర్తియై విలసిల్లు యాత్మసామ్రాజ్యాధిపతికి వారసులమై యున్నాము. ○○

# ధర్మం శరణం గచ్ఛామి

## మహాధనుని కథ

### శ్రీ బోధచైతన్య గారు

శ్రావస్తిలో మహాధనుడనే వర్తకుడుండేవాడు. సరుకులను తరలించుకొని పోవడానికి అతని దగ్గర 500 బండ్లు ఉండేవి. ఒకసారి అతను సరుకులెక్కించుకొని కోశంబికి ప్రయాణమయ్యాడు. ప్రయాణానికి ముందు జేతవన విహారానికి వెళ్ళి బుద్ధుణ్ణి సందర్శించి ఆ పిమ్మట అక్కడున్న భిక్షువులతో తన ప్రయాణ వివరాలు చెప్పి కోశంబికి రాదలచుకొన్న భిక్షువులెవరైనా ఉంటే తనతో రావచ్చుననీ వారికి అన్ని సౌకర్యాలూ కల్పిస్తానని చెప్పాడు. కొందరు భిక్షువులు ప్రయాణానికి సిద్ధమై అతనివెంట బయలుదేరారు.

మహాధనుడు చాలా అనుభవం ఉన్న సార్థవాహుడు గనుక తన ప్రయాణంలో సురక్షిత గ్రామాలను మజిలీలుగా చేసుకొంటూ మూడవ మజిలీగా ఒక అడవి సమీపంలోని గ్రామం చేరాడు. మరునాడు ఆ అడవిగుండా పోవలసి ఉంది. కానీ ఆ రాత్రి అతనికి ఒక వార్త అందింది-500 మంది ఉన్న ఒక పెద్ద బందిపోటు ముఠా తన సరుకును కొల్లగొట్టడానికి అడవిలో కాపువేసి ఉన్నారని. అంతమంది ఉన్న ముఠాను ఎదుర్కొనే రక్షకదళం తనకు లేనందువల్ల మహాధనుడు ఆ ప్రయాణాన్ని వాయిదా వేసుకొని శ్రావస్తికి సురక్షితంగా వచ్చేశాడు.

అతనితో పోయిన భిక్షువులు కూడా ప్రయాణం మానుకొని తిరిగి జేతవనానికి వచ్చేశారు. "అరె, బలే ఆశ్చర్యం! కోశంబికి పోయి అప్పుడే ఎలా తిరిగి రాగలిగారు? మీ దగ్గరేమైనా పాద లేపన విద్య ఉందా? లేక ఆకాశగమన విద్య ఉందా?" అని కొందరు వాళ్ళను వేళాకోళం చేశారు.

తిరిగి వచ్చిన భిక్షువులు సమయం చూచుకొని బుద్ధుడిని సందర్శించి తమ ప్రయాణ విఘ్నం ఎలా సంభవించిందో వివరించారు. ↳

[illegible]

[illegible]
[illegible]
[illegible]
[illegible]

పెక్కు కుండలి రూపమున ఉన్నను మట్టి ఒకటే. అనేక ఆభరణముల రూపమున ఉన్నను బంగారము ఒక్కటే. అనేక గోవుల నుండి పిండినదైనప్పటికిని పాలు ఒక్కటే. అట్లే అనేక దేహములందు వర్తించుచున్నను పరమాత్మ ఒక్కడే.

[illegible]
[illegible]

సన్న్యాసులకు ఇంద్రియ నిగ్రహము, వానప్రస్థులకు నియమపాలనము, గృహస్థులకు దానము, బ్రహ్మచారులకు గురుశుశ్రూష ముఖ్యములు.

---

ఈ వార్తను బుద్ధుడు ఒక దృష్టాంతంగా తీసుకొని వారికి ఇలా చెప్పారు : "దొంగల ముఠాకు భయపడి మహాధనుడు ప్రయాణాన్ని మానుకొన్నాడు. జీవితేచ్ఛ ఉన్నవాడు విషాన్ని దగ్గరకు రానివ్వడు. ఈ సంసారకాననం కూడ క్లేశ తస్కరులచే ఆక్రాంతమై ఉంది. (రాగం, ద్వేషం, మోహం మొదలైన క్లేశములు). కనుక ఇక్కడ రాకపోకలను కట్టిపెట్టి క్షేమదాయకమైన నిర్వాణపురంవైపు మీరు కూడా ప్రయాణం చేయాలి" అని చెప్పి క్రింది శ్లోకాన్ని పఠించారు.

[illegible]
[illegible] –ధర్మపదం 9–8

భయంకరమైన మార్గాన్ని మందిబలం తక్కువగా ఉన్న మహాధనుడు పరిహరించినట్లుగా, జీవితేచ్ఛ ఉన్నవాడు విషాహారాన్ని పరిహరించినట్లుగా అభ్యుదయ నిశ్శ్రేయసకాముడు పాపాలను పరిహరించవలెను.

## ఈశావాస్యోపనిషత్తు

# జగత్తంతయు దైవమయము

విద్వాన్ శ్రీ సాధుబసవయ్య గారు (కాగుపాడు)

ఉపనిషత్తు అనగా జీవుని దేవుని సన్నిధికి జేర్చునది యని యర్థము. ఉపనిషత్తునకు రహస్యమనియు నర్థముగలదు. ప్రాయికముగా నుపనిషత్తు నిగూఢార్థ బంధురమై యుండుటచేతను, హృదయ గుహానిహితమగు బ్రహ్మవస్తువు నుద్బోధించునది యగుటచేతను, తత్త్వవిదులగు ఋషీశ్వరులచే పరావిద్యగా పరిరక్షింపబడుటచేతను ఉపనిషత్తునకు రహస్యమను నర్థము ఉపపన్నమై యున్నది. ఉపనిషత్తునకు వేదాంతమనియు, శ్రుతి శిరస్సు అనియు నామధేయములు గలవు.

వేదాంతసిద్ధాంతమగుటచేతను, వేదకల్పవృక్షమునకు అగ్రభాగముగానుండుటచేతను వేదాంతమని, శ్రుతి భగవతికి శిరఃప్రాయముగా నుండుటచే శ్రుతి శిరస్సు అని నామ ధేయములేర్పడినవి. ఈ పరామర్శచే వేదవాఙ్మయమునందు ఉపనిషత్తు సర్వోత్తమము, సర్వశ్రేష్ఠమునై యొప్పుచుండుట విజ్ఞులు గుర్తింపగలరు. ఉపనిషత్తులలో నగ్రగణ్యము, శ్రేష్ఠము, సర్వోపనిషత్సారాంశమునగు నీశావాస్యము ప్రకృతము మనకు పరామర్శనీయమై యున్నది.

ఈశావాస్యమను వాక్యముతో ప్రారంభింపబడుటచే నీ యుపనిషత్తునకు "ఈశావాస్య"మను నామధేయముగలిగినది. ఈ యుపనిషత్తునందు పదునెనిమిది మంత్రములు గలవు. గీతయందలి "స్థితప్రజ్ఞ లక్షణముల"వలె నివి యెంతో క్లుప్తముగా ప్రవచింపబడినవి. ఈ యుపనిషత్తునందలి మొదటి మంత్రము అర్థగౌరవము, భావగాంభీర్యము, సమత్వముగలిగి శోభిల్లుచున్నది.

ఈశావాస్యమిదం సర్వం, యత్కించ జగత్యాం జగత్,
తేన త్యక్తేన భుంజీథా, మాగృధఃకస్య స్విద్ధనమ్.

ఈ పృథివిలోగల సర్వ చరాచర ప్రపంచమునందు పరమేశ్వరుడు పరివ్యాప్తుడై యున్నాడు. కావున, నీ సర్వస్వమును త్యజించి పరమేశ్వరునకు సమర్పించి, పరమేశ్వరుని యనుగ్రహముచే లభించినదానిని అనుభవింపుము! ఉపయోగింపుము! లోకమునందెవ్వరి ధనసంపదలను కాంక్షింపకుము! అని పై మంత్రము యొక్క భావార్థము.

"ఆత్మై వేదంసర్వం, ఆత్మన ఏవేదంసర్వమ్" "త్వమీశితా జగతస్తస్థుషశ్చ" అను శ్రుతి వాక్యానుసారముగా స్థావరజంగమమగు యావత్ప్రపంచము పరమాత్మకు జెందినదే యగుటచేతను, చరాచరజగదధిపతి పరమేశ్వరుడే యగుటచేతను ప్రపంచమునందలి గో భూ ధాన్య హిరణ్యాది ధనసంపదలెల్ల పరమేశ్వరునకు జెందినవే యగును. కావున, స్వకీయములైనను, పరకీయములైనను ధనసంపదలను కాంక్షింపకుము అని యర్థము. పై మంత్రమునందలి "తేనత్యక్తేన భుంజీథాః" అను వాక్యము పదే పదే మననముజేయదగినది. సర్వస్వము పరిత్యజింపక, పరమేశ్వరునకు సమర్పింపక భుజించుటకు, ఉపయోగించుటకు ఎవ్వరికిని అధికారము లేదను భావ మీవాక్యముచే వ్యక్తమగుచున్నది.

సర్వజగదధీశ్వరుడగు పరమేశ్వరుడే సర్వార్థప్రదాత. కోటీశ్వరునకు, పశువుల కాపరికి పరమేశ్వరుడే ప్రదాత. పై మంత్రమునకు మొదలగు నీశ శబ్దము, ఈశ-ఐశ్వర్యే, అను ధాతువునుండి యేర్పడినది. ఈశ శబ్దమునకు అఖిలైశ్వర్యసంపన్నుడు, పరిపాలకుడు అని యర్థము. అఖిలైశ్వర్య సంపన్నుడై, సర్వదా, సర్వజగత్పరిపాలకుడై పరమేశ్వరుడు జాగరూకుడైయుండ ఇది నాది అది నాదియని అహంకార మమకారములతో నధికాధికముగా ధన ధాన్యాది సంపదలను సంపాదించి కూడబెట్టుకొనుటకై యహోరాత్రము ప్రాకులాడుట అజ్ఞానచేష్టితమే యగును.

మనుష్యుని జీవితము త్యాగముచే శోభిల్లునేగాని భోగముచేగాదు. త్యాగమే యథార్థమైన యోగము. భోగమొక విధమగు రోగమేయగును. "భుంజీథాః" అను శబ్దమెంతో అర్థవంతమై యున్నది. భుజింపుము! ఉపయోగింపుము! అనుభవింపుము! అని యర్థము. లోకమున ప్రతి మానవుడున్ను అన్న పానీయములవలె తదితర వస్తువులను గూడ తనకు గావలసిన మేరకు మితముగా నుంచుకొనవలయునని

భావము. ప్రతి వ్యక్తి మితజీవితమునలవఱచుకొన్న యెడల లోకమునందు అన్నవస్త్ర వసతి సౌకర్యములు చాలక కష్టపడు కార్మికులకు, పారిశ్రామికులకు, కష్టజీవులకు ఎందఱికో మేలు చేకూరగలదు. త్యాగముచే ధనసంపదలు సద్వినియోగమును బొంది సార్థకములగును. త్యాగము చేయక, సద్వినియోగము చేయక ఆశతో గడించి దాచియుంచిన ధనసంపదలు నిరర్థకములగును.

మనుష్యుడు ఇంద్రియ వశంవదుడు, స్వార్థపరుడు, భోగలాలసుడగుటచే ధనసంపదలపట్ల ఆశ అధికమగు చుండును. "నకార్షాపణవర్షేణ తృప్తిః కామేషువిద్యదే" కామాసక్తుడగు నరునకు ఆకాశమునుండి బంగారునాణెముల వర్షము కురిసినను తృప్తిగలుగదు. ధనలాలస మనుజుని పిచ్చివానినొనర్చును. కావున ఇహలోకమున శ్రేయస్కాముడగు మానవుడు ధనసంపదలయెడల, భోగైశ్వర్యములయెడల, ఆపాతరమణీయములగు విషయ సుఖములయెడల అనాసక్తుడై, వీతరాగుడై, నిష్కాముడై త్యాగవైరాగ్యముల ద్వారా మోక్షధామమును జేరవలయునని పై మంత్రముద్బోధించుచున్నది.

మనుష్యుని శరీరమే వినశ్వరమై పండుటాకువలె రాలిపోవుచుండ, దారాపుత్ర ధనధాన్య గృహారామములయందు మమకారముగలిగియుండుట యెంత అవివేకమో, అజ్ఞానమో, వృథాచేష్టితమో విజ్ఞులరయగలరు. "త్యాగేనైకే అమృతత్వమానశుః" కర్మకలాపముచేగాని, ప్రజాసంతతిచేగాని, ధనసంపదలచేగాని, మోక్షలాభము, కైవల్య పదవి, భగవత్సాక్షాత్కారము గలుగనేరదు. ప్రాచీనులగు రాజర్షులు సర్వకామపరిత్యాగులై, సర్వసంగపరిత్యాగులై, సర్వస్వపరిత్యాగులై అమృతత్వమును, శివత్వమును, మోక్షమును బొందిరి. కావున, ముముక్షువులు, భక్తులు విశ్వమానవసౌహృదయమును, సమైక్యమును, కల్యాణమును ఆశంసించు నీశావాస్యోపనిషత్సందేశమును దైనందిన జీవితము నందాచరించి పవిత్రాత్ములై పరమాత్మసాక్షాత్కారమును బడసి కృతార్థులగుదురుగాక!

ఓం తత్ సత్

**Keep your heart as deep as the ocean and as [illegible] as the skies.**

**నీ హృదయమును సముద్రమువలె గంభీరముగ, ఆకా[illegible] విశాలముగను ఉంచుకొనుము.**

# టంకశాల (Mint)

టంకశాలలో కొందఱు బంగారు నాణెములు చేయుచుందురు. మఱి కొందఱు వెండి నాణెములు, ఇంక కొందఱు రాగి, ఇత్తడి నాణెములు చేయుచుందురు. కాని ఎవరును వాటిని బయటకు తీసికొని వెళ్లుటకు వీలులేదు. సాయంత్రము కాగానే ఆయా నాణెములను యంత్రాగారములోనే వదిలిపెట్టి వెళ్ళిపోవలెను. ఒక్క రాగిపైసా కూడా వెంట తీసికొని ఇంటికి వెళ్లుటకు వీలుపడదు.

ఈ ప్రపంచమొక టంకశాల. ఇందు ధనవంతులు, లక్షాధికారులు బంగారు వస్తువులలో మెలగుచుందురు. మధ్యతరగతివారు వెండి వస్తువులు కలిగియుందురు. బీదవారు రాగి, ఇత్తడి వస్తువులతో దైనిక వ్యవహారములను జరుపుచుందురు. కాని మరణానంతరము ఒక్క వస్తువునైన వెనువెంట తీసికొని వెళ్లుటకు వీలులేదు. తాము సంపాదించిన బంగారమును, ఇతర సంపదలను ఇక్కడే వదిలివేసి, చివరకు దేహమునుకూడ పారవేసి ఏకాకులై వెడలిపోవుదురు.

కావున జనులారా! ప్రాపంచిక సంపదలను జూచి మురిసిపోరాదు. ఈ ప్రపంచము టంకశాలయని గుర్తుకుతెచ్చుకొనవలెను. చివరకు చిల్లిగవ్వ కూడ వెంటరాదని నిశ్చయించుకొని దృశ్యపదార్థములపై మమత్వమును వీడి నీడవలె ఎల్లప్పుడు వెంటనుండు పరమాత్మనే ఆశ్రయించి ధన్యులు కావలెను.

God alone lives; Soul alone lives; Spirituality alone lives; Hold on to that.

దేవుడొకడే సత్యము, ఆత్మ ఒకటే సత్యము; పరమార్థమొకటియే సత్యము. దానినే పట్టుకొనుడు!

# రామాయణామృతం

## రామాలింగనం


శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి గారు ఎం.ఏ., ఎం.ఫిల్.

(నరసరావుపేట)


శ్రీ రాముడు పుంసాంమోహనరూపుడు. పురుషులకు సైతం వ్యామోహాన్ని కలిగించే సౌందర్యమతనిది. అంతటి అందగాడతడు.

సీతారామలక్ష్మణులు వనవాసం చేస్తున్న రోజులలో ఒక రోజున మునీశ్వరులు కొంతమంది ఆయనను చూశారు. వ్యామోహితులయ్యారు. మనమందరమూ ఒక్క పర్యాయం అతడిని ఆలింగనం చేసుకొందాం–"ఆలింగామో వయం రామం"– అను కొన్నారు. అదే విషయాన్ని అతడికి చెప్పారు. శ్రీరాముడు చిఱునవ్వు నవ్వుతూ నిరాకరించి, "వచ్చే జన్మలో నేను శ్రీకృష్ణుడుగా జన్మిస్తాను. మీరందఱు గోపిక లుగా జన్మిస్తారు. మీ కోరిక అప్పుడు నెఱవేఱుతుంది" అన్నాడు. ఆ తర్వాత కొంత కాలానికి హనుమంతుడు సీతాన్వేషణకు కిష్కింధ నుండి బయలుదేరి, శతయోజన విస్తీర్ణమైన సముద్రాన్ని దాటి, లంకానగరానికి వెళ్ళి, సీతను చూసి, తిరిగి కిష్కింధకువచ్చి, ఆమె క్షేమ వార్తలను రాముడికి తెలిపాడు. శ్రీరామునకు ప్రాణాలు లేచి వచ్చినై. అతనికి అపరిమితమైన ఆనందం కలిగింది. పారవశ్యంతో లేచి నిలబడ్డాడు.

[illegible]

[illegible] –రామాయణం,యుద్ధకాండ,1–13

"నాకు ప్రియమైనటువంటి వార్తను తెలిపి, ఇంతటి మహోపకారాన్ని చేసిన ఈ మహాభాగుడికి ప్రత్యుపకారంగా ఏమి చేసినప్పటికినీ, అది అసంపూర్ణంగానే ఉంటుంది. నా సర్వస్వమైన ఆలింగనం మాత్రమే దానికి సాటిరాదగింది" అని ఆలోచించి, హనుమంతుడిని సమీపించాడు. "హనుమా!"అంటూ గాఢంగా కౌగిలించు కొన్నాడు. ఇద్దఱి శరీరాలూ ఆనందంతో పులకించినై. ఆహా! మునీశ్వరులెంతోమందికి లభించని ఆ రామాలింగన సౌఖ్యాన్ని అనుభవించిన ఆ ఆంజనేయుడెంత ధన్యుడోగదా!

ప్రముఖ వాగ్గేయకారుడు త్యాగరాజు ఈ శ్లోకాన్ని తన ప్రహ్లాద భక్తి విజయ యక్షగానంలో (4–97) సందర్భోచితంగా ఉపయోగించుకొన్నాడు. ○○

# మహాభారత సుధ

## అర్జునుని మహోన్నత వ్యక్తిత్వము

అర్జునుడు పాండవ మధ్యముడు. మహాపరాక్రమశాలి. అస్త్రశస్త్ర విద్యా నిపుణుడు. సాక్షాత్ నరఋషి యొక్క అవతారము, శ్రీకృష్ణుని పరమ భక్తుడు, సఖుడు. అర్జునుని నిమిత్తముగా నుంచుకొని శ్రీకృష్ణుడు దుష్టసంహారమను తన అవతారోద్దేశ్యమును నెరవేర్చెను. అర్జునుని గూర్చి శ్రీకృష్ణుడే స్వయముగ గీత యందు 'భక్తోఽసి మే సఖా చేతి' (నీవు నా భక్తుడవు, సఖుడవు) అని చెప్పిరి! శ్రీకృష్ణుడు అర్జునుడు అనేక పర్యాయములు భిన్న భిన్న స్థానములందు చాలా కాలము కలిసిమెలసి అన్యోన్య సద్భావముతో ఆత్మీయతతో మెలగియుండిరి. ఉత్తర గోగ్రహణ సమయమందును, యుద్ధమందును భీష్మునంతటి మహా యోధాగ్రేసరుని కూడ ఎదిర్చి అర్జునుడు విజయమును చేబట్టెను.

పుత్రశోకముచే పీడితుడైన అర్జునుడు అభిమన్యుని మృత్యువునకు ప్రధాన కారణము జయద్రథుడని తెలిసికొని మఱుసటి దినమున సూర్యాస్తమయమునకు ముందే జయద్రథుని వధించివేసెదనని ప్రతిజ్ఞను పూని, శ్రీకృష్ణుడు తెలిపిన యుక్తి ననుసరించి ఆ ప్రకారమే ఆతనిని అంతమొందించివేసెను.

అర్జునుడు శివునిగూర్చి తపస్సుచేసి వారివలన పాశుపతాస్త్రమును బడసెను. శివునకున్ను అర్జునుని యెడల చాల దయకలదు. ఇంద్రునివలన అర్జునుడు గాండీవమను అద్భుత ధనుస్సును పొందెను. అర్జునునియందు దైవీగుణములనేకములు కలవు. అతడు ధీరుడు, వీరుడు, ఇంద్రియజేత, దయాళువు, కోమల స్వభావుడు, సత్యప్రతిజ్ఞుడు అయి యుండెను. అతనియందు పుట్టుకనుండియు దైవీసంపద్గుణములు అలరారుచుండెను.

'సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ' అని ఈ విషయమును భగవానుడే గీతయందు తెలిపియుండిరి. అర్జునుని యోగ్యతను గమనించి శ్రీకృష్ణుడు అతనిని

# ఆత్మానుసంధానము

ముముక్షువులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

ఘటావభాసకో భానుర్ఘటనాశే న నశ్యతి
దేహావభాసకః సాక్షీ దేహనాశే న నశ్యతి

ఘటమును ప్రకాశింపజేయు సూర్యుడు ఘటము నశించుటచే నశింపడు. అట్లే దేహమును ప్రకాశింపజేయు సాక్షియైన ఆత్మ దేహము నశించుటచే నశింపదు.

○○

---

⇨ నిమిత్తముగా నుంచుకొని మహత్తరమైన గీతాశాస్త్రమును లోకమునకు అందించిరి. గీతను భగవానుని ముఖతః విను భాగ్యమును బడసిన అర్జునుఁడు ధన్యుఁడు.

ద్రౌపదియొక్క స్వయంవర సమయమున అర్జునుఁడు ఏకచక్రపురమందు దుర్యోధన, సాల్వ, శిశుపాల, జరాసంధ, శల్యాదులెవ్వరును చేయఁజాలని పని చేసి వైచెను. అతఁడు ధనుస్సును అవలీలగ ఎత్తి లక్ష్యమును భేదించివైచి, ద్రౌపదిని బడసెను.

ఖాండవ దహన సమయమందును అర్జునుఁడు అద్భుత పరాక్రమమును చూపెను. ఇంద్రుని వాక్యమును పురస్కరించుకొని అర్జునుఁడు నివాత కవచులను దానవులను సంహరించెను. అర్జునుఁడు కొంతకాలము స్వర్గమున నివసించి ఇంద్రుని నుండి కొన్ని అస్త్ర విద్యలను నేర్చుకొనెను.

మహాభారత యుద్ధమందు అర్జునుఁడు ప్రధాన పాత్ర వహించెను. యుద్ధమందు శ్రీకృష్ణుఁడు అర్జునుని సారథిగ నుండిరి. యుద్ధమందు శ్రీకృష్ణుని సహాయముచే అర్జునుఁడు భీష్మ, ద్రోణ, కర్ణ, అశ్వత్థామాది యోధాగ్రేసరులను ఎదుర్కొని విజయమును సాధించెను. శూరవీరత్వము, అస్త్రజ్ఞానము, ఇంద్రియ జయము,- అను మూడు గుణముల యొక్క అద్భుత సమ్మిశ్రణము అర్జునునియందు కలదు. అర్జునుని జీవితము ఒక దివ్యజీవితము. ఆతని చరిత్ర ఆదర్శవంతము, శిక్షాప్రదము అయియున్నది.

○○

# ఉసిరిక

## శ్రీమతి కె. భార్గవి గారు M.Sc., (అనంతపురం)

కార్తీక మాసంలో ఉసిరిక చెట్టు క్రింద భోజనంచేస్తే మంచిదని మన పూర్వీకులు **వనభోజనం** అనే పేరుతో ఆ చెట్టు క్రింద భోంచేస్తుంటారు. ఇందులో గమ్మత్తేమిటంటె దీనిని ఔషధ మొక్కగా పరిగణించుటవలననే.

దీనిని తమిళంలో నెల్లికాయ అని, హిందీలో ఆమ్ల అని అందురు. ఉసిరిక ఔషధ విలువను గూర్చి తెలుసుకుందాము–దీనిని 'త్రిఫల' అను మందు తయారీలో వాడెదరు. సుఖవిరేచనకారి. కంటి నొప్పులకు, రక్తహీనతకు, దగ్గును నివారించేందుకు వాడెదరు. విరేచనములను, జిగట విరేచనములను నివారించుటకు వాడెదరు. కాలేయమునకు బలవర్ధకమైనది. 'ఎంబ్లికా' అను మందును కూడ ఉసిరిక ఫలముల నుండి చేయుదురు. రోజు ఒక ఉసిరికను తినిన అది 2 బత్తాయి కాయలు తిన్నంత విలువ. ఇది పైత్యానికి విరుగుడు.

ఉసిరికలలో 2 రకములు కలవు. పెద్ద ఉసిరిక (ఎంబ్లిక అఫిసినాలిస్ లేక ఫిల్లాంథస్ ఎంబ్లిక) అనునది ఉష్ణ లేక ఉప ఉష్ణమండలములలో ఎక్కువగా వ్యాపించి యుండును. ఆకులు రాల్చే మధ్యరకమైన వృక్షము. ఏకలింగ పుష్పములు అంటే స్త్రీ, పురుష పుష్పములు విడివిడిగ ఒకే వృక్షములో వుండును. చిన్న ఉసిరిక (ఫిల్లాంథస్ హిస్పిడస్) పత్రములు పెద్ద ఉసిరిక పత్రములకంటె పెద్దవి. శాఖలపైన, కాండముపైన కాయలు గుబురుగ, పసుపు రంగులో, పచ్చివి తినేందుకు వీలుగా వుంటాయి. కాయలు కూడ నునుపు వుండవు. పెద్ద ఉసిరిక లేత ఆకుపచ్చ రంగులో నునుపుగ వుండును. ఇవి కూడ పచ్చివి తినవచ్చు.

నిమ్మకాయలవలనే ఉసిరిక కాయలను పచ్చడి (నిల్వ)గా, ఊరగాయగా వేయవచ్చు. ఇది కూడ పైత్యానికి విరుగుడు. వీనిలో ప్రోటీన్లు 0.5 శాతము, శక్తి 85 కేలరీలు, కార్బోహైడ్రేట్లు 13.7 గ్రా శాతము, ఖనిజములు 0.5 గ్రా శాతము కలవు. ముఖ్యముగా 'సి' విటమిను 600 మి.గ్రా కలవు. 'సి' విటమిను లోపించిన వచ్చు స్కర్వి వ్యాధికి ఇది చాల మంచిది.

ఇది ఔషధ బలాన్ని కాక ఇతర ఉపయోగాలను కూడ కలది. సిరా తయారీలో, షాంపూ (తలకు వాడేది), రంగులలోను వాడెదరు. కలప కూడ లభించును. వీటి ఆకులను ముఖ్యముగ ఏలకుల పంటకు ఎరువుగ ఉపయోగించెదరు.

ప్రకృతిలో మనకు లభించే మొక్కలలో, ఆహారపదార్థములు, కాయగూరలు, మృదుఫలములు, నారలు, తైలములు, కలప, సుగంధద్రవ్యములే కాక ఎన్నో ఔషధాలు కూడ నిక్షిప్తమై వున్నవి. అటువంటి మొక్కలలో ఒకటైన ఈ ఉసిరిక చెట్టును వీలైనవారు పెంచుకోవచ్చు (ఇలాంటి మొక్కలను మనం అటవీ శాఖవారినుండి పొందవచ్చు). ఈ చెట్టు గాలి ఆరోగ్యప్రదమని పూర్వీకులు ఆ వనభోజనాలను సూచించిరి.

కానీ పరుగెడుతున్న కాలంలో పరుగులతో, ఉరకలతో యాంత్రికంగా జీవన యాత్ర చేస్తున్న మనం కార్తీక మాసంలో సరదాగ వనభోజనాలు ఏర్పాటుచేసుకోవడం ఎంతో అవసరం.

సరసమైన ధరకు లభించి, ఆరోగ్యాన్ని అందించే ఈ ఉసిరిక కాయలను ఆరగించి ఆరోగ్యాన్ని, ఆనందాన్ని పొందుతారుకదూ! OO

---

**Moderation in temper is a virtue.**
**Moderation in principle is a vice.**

**కోపతాపములందు మితత్వము వహించుట సుగుణము.**
**నియమపాలన మందు మితత్వము వహించుట దోషము.**

**(కోపతాపములను క్రమముగ తగ్గించుకొనుచు వచ్చి తుదకు అభ్యాసవశమున వానిని పరిపూర్ణముగ తొలగించివేయవలెను. కాని ధర్మాచరణమందు, నియమమును సంపూర్ణముగ పాలించవలెను—అనియే పై వాక్యముల భావము.)**

# వీరిని గురించి తెలుసుకోండి

## జాజలి

**జా**జలి ఒక మునిపుంగవుడు.

అతడు తపస్సు చేసుకొను సమయమున అతని తలపై పిచ్చుకలు గూటిని నిర్మించుకొనినవి. అవి గ్రుడ్లు పెట్టినను అతడు కదలలేదు. అవి పిల్లలైనప్పటికిని వాటికి ఏ హాని కలుగకుండ కదలకనే యుండి, అతడు తాను తపస్సిద్ధి పొందితినని గర్వించసాగెను. అతడు కదలక ఉండుటను గమనించి ఆ పక్షులు "ఆహా! ఏమీ ఇతని తపోమహిమ! ఎంతటి నిశ్చలత్వము!" అని పొగడసాగినవి. ఆ క్షణమున "ఇతని కంటెను గొప్పవాడు కలడు. అతడు వారణాశియందు నివసించుచున్న తులాధారుడు" అని ఆకాశవాణి శబ్దము వినపడెను.

వెంటనే జాజలి పిచ్చుక పిల్లలకు అపాయము కలుగకుండ వర్తకము చేయుచున్న తులాధరుని సమీపించి–"నేను పిచ్చుక పిల్లలకు ఏ హాని కలుగకుండునట్లు నిశ్చలముగ కూర్చుండి తపస్సు చేయుచున్నాను. మరి మీరెట్లు గొప్పవారు?" అని ప్రశ్నించెను. అపుడా తులాధారుడు–"నేను నిత్య సంతుష్టి కలవాడను. మట్టియందును, మాణిక్యమందును, సమభావము కలిగియున్నాను. యథాప్రాప్తముగ వచ్చిన దానిని స్వీకరించెదను. ఏ వస్తువును కోరను. అహంకారము లేకుండ ధర్మకార్యములను, దైవకార్యములను నిర్వర్తించుచున్నచో మనుజునకు జ్ఞానసిద్ధి, పరమశాంతి కలుగును. ఈ విషయమై నీ తలపై గల పక్షులను అడిగి తెలుసుకొనుము"ని బోధించెను.

మరుక్షణమున ఆ పక్షులు ఎదురుగ వచ్చి జాజలితో–"మేము ధర్మదేవత ఆదేశానుసారము వచ్చి యున్నాము. గర్వము, ఈర్ష్య, కామక్రోధాదులు లేనివాడు పరమానందముననుభవించును" అని పలికినవి. పిదప తులాధారుడు జాజలికి బ్రహ్మ గీతలను ఉపదేశించెను.

(ఇంద్రియములను జయించుటయే, మనోనిగ్రహము కలిగియుండుటయే, ఈర్ష్య, అసూయ, దంభము మొదలగు దుర్గుణములను త్యజించుటయే యథార్థమగు తపస్సు. ఇట్టి తపస్సును ఆచరించువాడు మహత్తరమగు శాంతిని, పరమానందమును పొందగలుగును.) ○○

# సృష్టిలోని వింతలు - విశేషాలు

1) అమెరికాలో న్యూయార్క్ సమీపమునగల వెర్రాజానో-నారోస్ బ్రిడ్జి-మధ్యలో ఏ స్తంభము లేక 4,200 అడుగుల పొడవు కలిగి-ప్రపంచములోనే ఎక్కువ స్పాను (Span) గల బ్రిడ్జిగా ప్రఖ్యాతిగాంచినది.

2) సూర్యగోళం మధ్యగల ఉష్ణోగ్రత 1 కోటి 50 లక్షల డిగ్రీలు.

3) యురేనస్ గ్రహమునకు సూర్యుని చుట్టూ ప్రదక్షిణము చేయుటకు 84 సంవత్సరములు పట్టును.

4) అమెరికాలో చెత్త నుండి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయుచున్నారు. 10 వేల టన్నుల చెత్తను తగులబెట్టగా వచ్చు వాయువులద్వారా 5,600 ఇండ్లకు సరిపడు విద్యుత్తు ఉత్పన్నము చేయుచున్నారు.

5) 1990 నాటికి భారతదేశంలో 19,950 ఏనుగులు కలవు.

6) రామేశ్వరంలోని దేవాలయ మంటపము భారతదేశపు దేవాలయ మంటపములన్నిటిలోను పెద్దది.

7) సూర్యునకు అపారమైన ఆకర్షణశక్తి కలదు.వందల కోట్ల మైళ్ల దూరములోనున్న యురేనస్, నెప్ట్యూన్, ప్లూటోవంటి గ్రహములను కూడా సూర్యుడు తన అధీనములో పెట్టుకొనుచున్నాడు.

○○

No great work can be done without sacrifice

త్యాగము లేనిచో ఏ గొప్ప కార్యమున్ను సాధింపబడదు.

ఈ నలుగురు అన్నదమ్ములు. అందులో పెద్దవాడు ధర్మం. డబ్బు కలవాడు ధనికుడు. పెద్దన్నగారైన ధర్మాన్ని ఆదరిస్తే అనగా తన డబ్బును ధర్మకార్యాలకు వినియోగిస్తే తక్కిన ముగ్గురు సోదరులు కిక్కురుమనకుండా ఉంటారు. అట్లు కాక ఆ ధనికుడు జ్యేష్ఠ సోదరుడైన ధర్మాన్ని గౌరవించకపోతే అనగా తన డబ్బును ధర్మకార్యాలకు, పరోపకార కార్యాలకు ఉపయోగించకపోతే తక్కిన ముగ్గురు సోదరులు కోపగిస్తారు, చెలరేగుతారు, అతని ఆస్తికి నష్టం వాటిల్లజేస్తారు-అని ఒక కవీశ్వరుడు చక్కగా వివరించాడు. ఒక శ్రీమంతుడు తన ఆస్తిలో కొంత భాగాన్నైనా ధర్మకార్యాలకు వాడకపోతే రాజు పన్నులు వేయటం మొదలుపెడ్తాడు. అగ్ని అతని స్థిరచరాస్తులలో కొంత భాగాన్ని దహించివేస్తుంది. దొంగలు అతని ఆస్తిలో కొంత భాగాన్ని అపహరిస్తారు. ఒకడు తన ఆస్తిని ధర్మకార్యాలకు ఎక్కువగా ఉపయోగిస్తే పన్నులు వేయటానికి ఆస్తి ఏమి మిగులుతుంది? అట్లే దహించటానికి ఏ వస్తువులు మిగులుతాయి? తస్కరించటానికి దొంగకు ఏమి మిగులుతుంది?

కాబట్టి విజ్ఞులైన ధనికులు డబ్బుకు వారసులైన నలుగురిలో పెద్దన్నగారైన ధర్మాన్ని సగౌరవంగా చూడాలి, ఆదరించాలి. అనగా తన సొత్తులో అధిక భాగాన్ని ధర్మకార్యాలకు వినియోగించాలి, బీదలకు పంచిపెట్టాలి, సత్పాత్రులకు ఒసంగాలి, అన్నదానం, వస్త్రదానం మొదలైనవి చేస్తూండాలి, దారిద్ర్యంతో బాధపడేవారికి

ఎదుటివాని మనస్సును నొప్పించక ప్రియముగ మాట్లాడవలెను.

అనేక కేంద్రములతో పరిధిలేని వృత్తమే పరమాత్మ. (God is a circle whose centre is everywhere but circumference nowhere)

ఒకరికి చెప్పుటకు ముందు తాను ఆచరించుట శ్రేష్ఠము.

తప్పుచేయుట పాపము. దానిని కప్పిపుచ్చుట మఱింత పాపము.

అనివార్యమగు దానికొఱకు విలపించరాదు.

దానమును గుప్తముగా చేయవలెను. కుడిచేయి చేసినదానిని ఎడమచేతికి తెలియనీయరాదు.

సంతుష్టియే స్వర్గధామము. ○○

చేయూతనివ్వాలి, ఆకలితో అలమటించేవారిని ఆదుకోవాలి. అట్లు చేయకపోతే అది అంతాగాని, కొంతగాని ప్రభుత్వంవారికి చెందిపోతుంది, అగ్నికి ఆహుతైపోతుంది, దొంగలపాలవుతుంది.

దానధర్మాలు పుణ్యసంపాదనకై మానవునకు ఎంతగానో తోడ్పడతాయి. డబ్బుగాని, వస్తువులుగాని మరణించిన పిదప జీవుని వెంట పోవు. కాని ఆ డబ్బునే ధర్మకార్యాల ద్వారా పుణ్యంగా మార్చుకొంటే ఏ లోకానికి వెళ్ళినా వెంట వచ్చి ఆ పుణ్యమే కాపాడుతుంది. కాబట్టి జీవుడా! ధర్మకార్యాలుచెయ్యి. పరప్రాణికి ఉపకారం చెయ్. వెంట వచ్చే ధనాన్ని(పుణ్యాన్ని) సేకరించుకో. ఏ విధమైన పుణ్యసంపాదన చేయక జీవితాన్ని వృధా చేసుకోవద్దు. సత్యాన్ని, ధర్మాన్ని ఆదరించు. డబ్బును దుర్వినియోగపర్చకు. సంపద ఉండటం గొప్పకాదు, దాన్ని సద్వినియోగపరచటం గొప్ప అని తెలుసుకో. అట్లు తెలిసికొని జాగ్రత్తగా మెలగు. జై గురుదేవ్.

చత్వారో విత్తదాయాదాః ధర్మ భూపాగ్ని తస్కరాః
జ్యేష్ఠ భ్రాతావమానేన త్రయః కుప్యంతి సోదరాః ○○



# వేదాంత గోష్ఠి

## నేటి చర్చనీయాంశము - జరాదుఃఖం

**శిష్యుడు (శివప్రసాద్)**- స్వామీ! గురుదేవా! ఏయే విషయములను గూర్చి లెస్సగ పర్యాలోచిస్తే, దీర్ఘంగా యోచిస్తే మానవునకు దృశ్యప్రపంచం యెడల విరక్తి, భగవంతుని యెడల ఆసక్తి కలుగుతుందో, మోక్షమును గూర్చిన ఆకాంక్ష పెరుగుతుందో తమరు ఇదివరకు తెలియజేస్తూ జన్మదుఃఖాన్ని గూర్చి విపులంగ బోధించియున్నారు. జన్మదుఃఖంతో పాటు ఇంకను 3 భయంకర దుఃఖాలు కలవనియు తమరు చెప్పి యున్నారు. కాబట్టి వాటిని గూర్చి కూడ వివరంగ తెలుప ప్రార్థన.

**గురువు (ప్రబోధానందస్వాములవారు)** - నాయనా! శివప్రసాద్! ఈ ప్రపంచంలో జన్మించిన మానవునకు ఏ విధంగానైనా వైరాగ్యం ఉదయించిందంటే ఇక అతనికి మోక్షం చేరువలో ఉన్నట్లే. జీవితంలో మానవునకు కలుగుచున్న భీతావహములైన దుఃఖాలను గూర్చి లోతుగ విచారిస్తే ఎటువంటి మందమతికైనా వైరాగ్యం కలిగి తీరుతుంది.

ఇపుడు చెప్పబోయే దుఃఖం ఆ దుఃఖాలకు సంబంధించిందే. అదే జరాదుఃఖం. 'జరా' అనగా ముసలితనం. శరీరం పుట్టిన తర్వాత ఒకే విధంగ ఉండదు. అది మూడు దశలుగా మారుతుంది-బాల్యం, యవ్వనం, వార్ధక్యం అని. శరీరమనేది ఎప్పుడూ ఒకే విధంగ ఉండదు. అది నిరంతరం మార్పులు పొందుతూంటుంది. బాల్యకాలంలో నిగనిగలాడుతుంది. యవ్వనకాలంలో బలవర్ధకంగ కనిపిస్తుంది. ముసలితనంలో ముడుచుకొనిపోతుంది, కృశించిపోతుంది. ఇక మరణ సమయంలో అదృశ్యమౌ తుంది. ఈ ప్రకారంగ నిరంతరం పరిణామం పొందుతున్న శరీరంలో ఇక స్థిరత్వ మెచట? నిర్వికారత్వమెచట? "శీర్యతే ఇతి శరీరం" (కృశించిపోతుంది కనుక శరీర మని పేరు వచ్చింది) అని పెద్దలు చెప్పుదురు.

నిరంతరం పరిణామశీలమైన ఇట్టి శరీరంలో యవ్వనకాలమైన తరువాత వార్ధక్యమనే దశ వస్తుంది. ఆ స్థితిలో ఇక జీవుని శరీరం కేవలం కృశించి, రోగగ్రస్తమై,

వికారభూయిష్ఠమై చాలా పరితాపం కలిగిస్తూంటుంది. మాట సన్నగిలిపోతుంది, నడక తొట్రుపడుతూంటుంది. పండ్లు ఊడిపోతాయి, చూపు తగ్గిపోతుంది, చెవిటితనం పెరిగిపోతుంది. ఇట్టి వికారాలు ఎన్నో కలిగి మానవుని సతమతం చేస్తూంటాయి. ఆ సమయాన అనగా వార్ధక్యమందు మానవునకు కలిగే బాధ, దుఃఖం, పరితాపం ఊహింపరానిది. ఇతర దుఃఖాలు ఎన్ని యున్నా ఒకవేళ అతడు సర్దుకొని పోగలడేమోకాని, చుట్టుప్రక్కలఉన్న బంధువులవలన, సన్నిహితులవలన అతనికి కలిగే బాధ భరింపరానిదై యుంటుంది. పిల్లలుకాని, సోదరులు కాని, తదితరులుకాని తాతగారిని లెక్కచేయరు, దూషిస్తూంటారు, హేళన చేస్తూంటారు. వార్ధక్యంలోని ఇట్టి పరిస్థితి జీవునకు చాల భయంకరంగ ఉంటుంది.

జీవితంలో అన్నిటికంటె ముఖ్యమైన కార్యక్రమం భగవద్ధ్యానం, దైవచింతన, ఆత్మవిచారణ ఇట్టి అతిముఖ్యమైన కార్యక్రమం వార్ధక్యంలో కొనసాగించటం మహా కష్టం. అనేక ప్రతిబంధకాలు కలుగుతూంటాయి. కాబట్టి జీవితంలో అత్యవసరమైన ఈ మహోన్నత కార్యక్రమం వార్ధక్యంలో కుంటుపడ్తుంది. ఈ పరిస్థితులన్నీ ఆలోచిస్తూంటే జీవునకు వార్ధక్యమనేది ఒక పెనుభూతంగ తోస్తుంది. "వ్యాఘ్రీవతిష్ఠతి జరా" (ముసలితనము పెద్దపులివలె కాచుకొనియున్నది) అని శ్రీ శంకరాచార్యులవారు వృద్ధాప్యమును చక్కగ వర్ణించియున్నారు.

కాబట్టి శరీరమునకు కలుగు ఈ దుఃఖాలన్నిటిని గూర్చి విచారించి వివేకవంతుడైనవాడు మున్ముందు శరీరమే రాకుండ చేసుకొనే ఉపాయంకొరకు ప్రయత్నించవలసియున్నది. ఆ ప్రయత్నమే ఆత్మజ్ఞాన సంపాదన. ఈ జన్మలో ప్రయత్నపూర్వకముగ ఆత్మజ్ఞానమును సాధిస్తే, స్వస్వరూపానుభూతిని పొందితే సంచిత కర్మ అంతయు భస్మమైపోతుంది. కర్మ లేనందువలన ఇక జన్మ ఉండదు. జన్మ లేనందువలన ఈ దుఃఖాలేవీ ఉండవు. అదే మోక్షం. అదే కైవల్యం.

నాయనా! శివప్రసాద్! శరీరానికి కలుగుతున్న ఈ జన్మ జరాదుఃఖాలను గూర్చి నీవు బాగుగ విచారించి, వైరాగ్యమును బడసి, దేహాభిమానాన్ని త్యజించి జీవితం పూర్తికాకముందే, ఆత్మజ్ఞానాన్ని బడసి ధన్యుడవుకా!

**శిష్యుడు** – స్వామీ! గురుదేవా! వార్ధక్యంలో జీవునకు కలిగే బాధలు వింటూంటే నా ఒడలు కంపించిపోతుంది.కావున అసలు శరీరమే రాకుండ చేసుకొనే ఉపాయం ఆత్మానుభూతి ఒకటే అను సత్యం తమ బోధలవల్ల నేను చక్కగా తెలుసుకొన్నాను. అట్టి జ్ఞానాన్ని పొందటానికై ఇకమీదట నేను నిరంతరం కృషి చేస్తూ, జన్మ రాహిత్యానికై, దుఃఖరాహిత్యానికై పాటుపడతాను. అనుగ్రహింపుడు. సెలవు.

○○

# ఆధ్యాత్మిక కథలు

ఒకానొక పట్టణములో ఒక హైస్కూలు కలదు. అది ప్రభుత్వ పాఠశాల. ఎందఱో విద్యార్థులు సమీప గ్రామముల నుండి అచటికి వచ్చి విద్యాభ్యాసము చేయుచుందురు. ఉపాధ్యాయులు గొప్ప అనుభవజ్ఞులు. కాబట్టి ఆ పాఠశాల నుండి విద్యార్థులు అత్యధిక సంఖ్యలో ఉత్తీర్ణులగు చుండిరి.

ఒకనాడు తొమ్మిదవ తరగతిలో ఇంగ్లీషు ఉపాధ్యాయుడు విద్యార్థులకు ఇంగ్లీషు వ్యాకరణములోని ఒక పాఠమును బోధించుచుండెను. దానిని ఇంగ్లీషులో సింటాక్స్ (syntax) అందురు. వాక్య రచనకు సంబంధించిన విజ్ఞానమును 'సింటాక్స్' అందురు. ఉపాధ్యాయుడు దాని అర్థమును పిల్లలకు చక్కగా నూరిపోసెను. అతడు విద్యార్థులతో ఇట్లు చెప్పెను–

"విద్యార్థులారా! కొద్ది రోజులలో డి.ఇ.ఒ. గారు (జిల్లా విద్యాశాఖాధికారి) మన పాఠశాలకు ఇన్స్పెక్షన్ కొఱకు రాబోవుచున్నారు. వారు వచ్చి 'సింటాక్స్' అనగా ఏమి? అని ప్రశ్నించినచో గబగబా దాని అర్థమును చెప్పివేయండి. అది వాక్య రచనకు సంబంధించిన విజ్ఞానమని 'టఫీ'మని చెప్పండి. అపుడు వారు చాల సంతోషించుదురు"

విద్యార్థులు అట్లే ఆ పాఠమును బాగుగా వల్లించి ఉంచిరి. సరిగా నిర్ణీత సమయమునకు ఇన్స్పెక్టరు గారు అదే క్లాసుకు వచ్చి ఒక విద్యార్థిని లేపి "సింటాక్స్ అనగా ఏమి?" అని అడిగెను. పిల్లవాడు వెను వెంటనే "ఇది వాక్యరచనకు సంబంధించిన విజ్ఞానము" అని కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పివైచెను. ఇన్స్పెక్టరు గారు చాలా సంతోషించి మఱొక పిల్లవానిని లేపి అదే ప్రశ్న అడిగెను. అతడు కూడా మొదటి విద్యార్థివలెనే పొల్లు పోకుండా

జవాబు చెప్పివైచెను. ఈ ప్రకారముగ ముగ్గురు విద్యార్థులను వరుసగా అదే ప్రశ్నను అడుగగా వారందఱు సరియైన సమాధానమొసంగిరి.

కాని నాలుగవ విద్యార్థిని ఆ ప్రశ్న అడుగగా అతడు వారము దినముల నుండి స్కూలుకు రానందువలన దాని అర్థము చెప్పలేకపోయెను. క్లాసు మాస్టరు ఆ పిల్లవానితో "పోనీ దాని భావమేమిటో చెప్పు" అని చెప్పగా పిల్లవాడు వెంటనే 'సింటాక్స్' అనగా (Tax upon sin) పాపము మీద పన్ను అని చెప్పివైచెను. అది విని ఇన్స్పెక్టరుతో సహా అందరు గొల్లున నవ్విరి.

పాపముపై పన్ను కలదు. అదియే దుఃఖము. ఎవ్వరైనను పాపము చేసినచో దుఃఖము అనుభవించవలసి వచ్చును. కాబట్టి జనులు పాపమును ఏ మాత్రము ఆచరించక దుఃఖము అను పన్ను యొక్క భారము నుండి విముక్తులు కావలయును.

**నీతి : పాపమునకు పన్ను దుఃఖము. కాబట్టి పాపాచరణను విరమించినచో పన్ను యొక్క భారము వదలిపోవును. విశ్వప్రభుత్వ శాసనము ప్రకారము పాపము చేయువారు దుఃఖమును అనుభవించక తప్పదు. కావున పాప కార్యములను విరమించి పుణ్యాచరణ మాత్రమే కలిగి యుండవలెను.** OO

> అచిన్త్యరూపో భగవాన్నిరంజనో
> విశ్వంభరో జ్యోతిమయః పరాత్మా
> న భావితో యేన హృదిక్షణేన
> వృథాగతం తస్యనరస్య జీవనమ్.
>
> అచింత్యరూపుడును, నిరంజనుడును, ప్రపంచమునకు ఆధారభూతుడును, జ్యోతిర్మయుడును అగు పరమాత్మను ఎవడు తన హృదయమందు ఒక క్షణకాలమైనను ధ్యానింపడో అట్టివాని జీవితము నిరర్థకమేయగును.

సీరియల్

# జనమేజయ మహారాజు - 2

# పరిక్షిత్-పాము

## ఈశ్వర్

మహామంత్రి జనమేజయునకు ఇలా చెప్పెను :

మీ ముత్తాతగారైన యుధిష్టరమహారాజు మీ తండ్రిగారైన పరిక్షిన్మహారాజుకు పట్టం కట్టి సింహాసనమును అధిష్టింపచేసిన పిదప పూర్వుల అడుగుజాడలలో నడుస్తూ రాజ్యాంగాన్ని న్యాయమార్గంలో సంరక్షిస్తూ వచ్చారు. మీ నాన్నగారు అప్రతిహతమైన పరాక్రమశాలి. వన్యమృగాల వలన ఆటవిక ప్రజలు నానాయాతనలు పడుచుండుట గమనించి మునిజనులకు కూడా వాటి బాధ తప్పించాలనే సంకల్పముతో పరివారసమేతుడై ఒకనాడు వేటకు వెళ్లాడు.

ఒకచోట క్రూరమృగము వారి కంటబడింది. దానిని వధించాలనే ధ్యేయముతో దానిని తరుముకుంటూ పరివారాన్ని కూడ విడిచిపెట్టి చాలాదూరం వెళ్లాడు పరిక్షిత్తు. మధ్యాహ్నమయింది. ఎండ వేడిమి అధికమైంది. నోరు ఎండిపోయింది. నీరు కరువాయెను. ఎక్కడ వెతికిన దోసెడు నీరు లభించలేదు. అలసిపోయి నీటి కొరకు తిరుగుచుండగా ఒక ముని వాటిక కనిపించెను.

### అది శమీక మహర్షి ఆశ్రమం

ఆ సమయంలో శమీక మహర్షి సర్వస్వము మరచి నిశ్చల మనస్సుతో ధ్యాన నిమగ్నుడై యుండెను. త్రాగుటకు నీరులేక నోరెండిపోవుచున్న సంకటస్థితిలో వున్న పరిక్షిన్మహారాజు "దాహం వేస్తోంది స్వామీ! కాస్త మంచినీరు ఇప్పించండి, చూపండి, రక్షించండి, కరుణించండని" ఎన్ని పర్యాయాలు అడిగినా ధ్యానములో నిమగ్నుడైన శమీక మహర్షికి ఆ మాటలు వినిపించలేదు.

### పరిక్షిత్తు అవమానంగా భావించుట

ఈ తాపసి నన్ను అగౌరపరుస్తాడా? మంచినీరు ఇమ్మని ప్రార్థిస్తే మౌనము వహిస్తాడా? తాపసులకింత అహంకారమా? అని ఆవేశముతో అటు ప్రక్కనే చచ్చి

పడివున్న పామును తీసి మహర్షి మెడలో వేసి తన దారిన తాను వెళ్ళాడు పరిక్షిత్తు. అలా వెళ్ళిన పరిక్షిత్తు తన పరివారముతో కలసి రాజధాని చేరాడు.

## పిడుగువంటి వార్త

శమీక మహర్షి పుత్రుడగు శృంగి కొంత సమయానికి ఆశ్రమము చేరి తండ్రి మెడలోని చచ్చిన పామును చూచి "ఏనాడు ఎవరికిని ఇసుమంత ద్రోహము చేయ తలపెట్టని మహా సాత్వికుడయిన నా తండ్రిని అవమానపరచిన వ్యక్తి ఈ రోజు నుండి 7 దినములలోగా తక్షక విషాగ్నికి భస్మమై పోవుగాక!" అని శపించాడు.

## శాప ఉపశమనమునకై శమీక మహర్షి ప్రయత్నించుట

కొంత సమయానికి శమీక మహర్షి ధ్యానసమాధి నుండి లేచి తన కుమారుడు తొందరపాటుతో, ఆవేశముతో చేసిన శాపాన్ని తెలుసుకొని దానిని ఉపసంహరించు కొమ్మని కుమారుడు అగు శృంగిని ఆదేశించాడు. అది అసాధ్యమని తన వశములో లేదని ఉపసంహరణ విధానము తనకు తెలియదని శృంగి జవాబిచ్చెను. ఆవేశముతో తన కుమారుడు చేసిన తప్పిదనాన్ని పరిక్షిత్తుకు తెలియచేయుమని తన శిష్యున్ని పంపాడు శమీక మహర్షి.

## ఒంటి స్తంభం మేడ

ఈ అశుభవార్త విన్న పరిక్షిన్మహారాజు జరిగిన దానికి దుఃఖించి ఆవేశము అనర్థ ములకు మూలమని గ్రహించి శాపము నుండి తనను తాను రక్షించుకొనుటకు మార్గ మును అన్వేషించుటలో నిమగ్నుడాయెను. మంత్రులు సామంతులు కలిసి అప్పటి కప్పుడే ఒక ఒంటి స్తంభము మేడను తయారుచేయించి అందులో పరిక్షిన్మహా రాజును వుంచిరి. ఆ మేడ చుట్టూ అప్రతిహతులైన వీరభటులను సేనానాయకులను కాపలాగా వుంచి ఎట్టి క్లిష్టపరిస్థితినైనను ఎదుర్కొనుటకు కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు చేసిరి.

దేశవిదేశాల నుండి సుప్రసిద్ధులైన సిద్ధహస్తులైన విషవైద్యులను, మంత్రగాళ్ళను రప్పించిరి. ఇంత గట్టి భద్రతా ఏర్పాట్ల మధ్య పరిక్షిత్తు భగవన్నామస్మరణ చేస్తూ 6 రోజులు చక్కగ కాలం గడిపెను. శాపగండం నుండి గట్టెక్కుటకు మరొక్క రోజు మాత్రమే వుంది. అది కీలకమైన రోజు. చీమను కూడా లోపలికి అనుమతించము అను రీతిలో అప్రతిహతమైన భద్రతాఏర్పాట్లు చివరి రోజగు ఏడవరోజు చేయించిరి.

ఇలా వుండగ హస్తినాపురములోని ఒక పౌరుడు కట్టెల కొరకై అడవికి వెళ్ళి ఏదో ఒక వింతైన విచిత్రమైన వార్తను తెచ్చాడని కొందరు రక్షక భటులు ఆ వ్యక్తిని నా వద్దకు తీసుకొని వచ్చిరి అన్నాడు మహామంత్రి.

"ఆ వ్యక్తి తెచ్చిన వార్త ఏమిటి?" అని చాలా కుతూహలంగా అడిగాడు. జనమే జయ మహారాజు.

(సశేషం)

# ప్రశ్నోత్తర వేదిక ?

# సందేహాలు – సమాధానాలు

డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A.,Ph.D.
(తిరుపతి)

**ప్రశ్న :** *దైవీ ఆసురీ అనే సంపదలవల్ల మనకేం కలుగుతుంది? వీటికీ మన జీవితానికి ఏమైనా సంబంధం వుందా?*

**జవాబు :** ఎవరు దైవీసంపదలో పుట్టి దాన్నే పెంచుకుంటారో, వారు మోక్షానికి అర్హులౌతారు. ఎవరు ఆసురీ సంపదలో పుట్టి దాన్ని బాగా పెంచుకుంటారో, వారు సంసారబద్ధులై ఈ వలయంలో పుడుతూ ఛస్తూ తిరుగుతుంటారు.

**దైవీసంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా ।**
**మా శుచః సంపదం దైవీమభిజాతోఽసి పాండవ ।** (భగవద్గీత 16–5)

**ప్రశ్న :** *"దేవుడు లేడం"టారు కొందరు. "ఆచారం గీచారం లేదు, ఇదంతా చాదస్త" మంటారు మఱి కొందరు. ఎప్పుడూ చికాకుపడుతుంటారు ఓ కొందరు. వీరందరినీ చూస్తుంటే జాలి కలుగుతుంది. వీరే తెగకు సంబంధించినవారు? వీరి ప్రవృత్తులెలా వుంటాయి?*

**జవాబు :** వీరందరు ఆసురీ సంపదలో పుట్టినవారు. అందుకనే వారి ఆలోచనలన్నీ అలా వుంటాయి. వారికి ప్రవృత్తి–నివృత్తి మార్గాలని రెండు మార్గాలున్నాయని కూడా తెలియదు. ప్రవృత్తి అంటే పరమాత్మకు అంశభూతుడైన జీవుడు ప్రకృతివశుడై సంసారంలోకి పోవడం. నివృత్తి అంటే వెనకకు వెళ్ళడం. సంసారంలో విసుగుపడినవాడు మఱల ముముక్షువై, ముక్తుడై పరమాత్మ సాయుజ్యాన్ని పొందడం. ఈ ఆసురీ సంపదలో పుట్టినవారికి పరిశుద్ధంగా వుండటం, మంచి నడవడి కలిగి వుండటం, నిజమే పల్కడం అంటే గిట్టదు.

"సృష్టికర్త అయిన దేవుడెవ్వడు లేడని, ఈ ప్రపంచోత్పత్తిలో కార్యకారణభావమేదీ లేదని, కామాధిక్యంవల్ల కలిగిన స్త్రీ పురుష సంయోగం వల్లనే ఈ సృష్టి జరుగుతున్నది కానీ, పుణ్య పాపాల్లాంటి ఇతర కారణాలేవీ లేవని, వారి సిద్ధాంతాలు. ఇలాంటి ఆలోచనలతో వారు నిత్యమైన ఆత్మ లేదనుకొని, ఆత్మ సంస్కారాలు, ఆత్మశక్తి లేకుండా నీచమైన బుద్ధులతో, అతి భయంకరమైన పనులు చేస్తూ, క్రూరంగా ప్రపంచాన్ని నాశనం చేస్తుంటారు. ఎన్నటికీ తృప్తినందని కామాన్ని ఆశ్రయించి, ఆడంబరం, అభిమానం, మదం మొదలగు దుర్గుణాలతో, అజ్ఞానంతో అనేక విషయాలలో భ్రమపడి, నీతి నియమాలు లేకుండా సంచరిస్తుంటారు.

అంతులేని చింతలతో, కామంతో, శారీరకమైన సౌఖ్యాలను అనుభవించడమే జీవిత లక్ష్యమనుకొని, అంతకంటే జీవితంలో తాము సాధించవలసిందేమీ లేదని గట్టిగా నిశ్చయించుకొని, ఇన్నీ అన్నీ అనడానికి వీలులేనన్ని ఆశాపాశాలతో బద్ధులై, కామ-క్రోధాలకు దాసులై, తమ స్వేచ్ఛా భోగానుభవాలకు కావలసిన డబ్బును, ఎంత నీచమైన మార్గాలగుండా అయినా సరే, అన్యాయాలు, అక్రమాలు చేసి సంపాదించాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తుంటారు. కనుక వీరిని మనం ఒక కంట కనిపెట్టి వుండాలి. వీలున్నంత వఱకు వారి ప్రభావాలు మనమీద పడకుండా చూసుకోవాలి.

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥ (భగవద్గీత 16-7)

ОО

## తిరుగలి (ఇసురురాయి)

శ్లో ॥ భవదుఃఖఘరట్టేన పిష్యన్తే సర్వమానవాః ।
దుఃఖముక్తః సదానందః కృష్ణభక్తో హి కేవలః ॥

సంసార దుఃఖమను తిరుగలియందు పడి జనులందరును నలిగిపోవుచున్నారు. కేవలము కృష్ణభక్తుడు (భగవద్భక్తుడు) ఒకడే ఆ దుఃఖము నుండి విడివడి సదా పరమానందమును పొందుచున్నాడు.

# 66వ సనాతన సభలో
# శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి సందేశము
## 20-3-1992

–సేకరణ : శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు, తిరుపతి

66 సంవత్సరాల ముందు నాటిన బీజం శాఖోపశాఖలుగా విస్తరించింది. ఆధ్యాత్మికామృతధారలను స్రవింపజేసి ఈ సనాతన వేదాంత సభలు ప్రజల తాప త్రయాన్ని పోగొడుతున్నాయి. దుఃఖానికి అసలు కారణమేమిటో తెలుసుకోవాలి. దుఃఖాన్ని తొలగించుకొని ఆనందసాగరంలో మునకలు వేయాలి.

అర్జునుడు ఎంతో విషాదం పొందాడు. కృష్ణుడు అతని విషాదాన్ని నివారించాడు. ఇప్పుడు మనం పిడుగులు పడే సమయంలో అర్జునుణ్ణి స్మరించుకొంటున్నాముకదా!

అర్జున విషాద నివారణకు గీతా ప్రబోధం సాధనమయింది. మన విషాదం కూడా దీనివల్ల తొలగిపోతుంది. విషయం తెలియనంత వరకూ దుఃఖం తప్పదు. అది తెలిసిన తర్వాత దుఃఖానికి తావులేదు. ఒకని ఇంట నిధి వున్నా అది వున్నదని చెప్పేవాడు లేకపోవడంవల్ల అతడు పేదరికం అనుభవిస్తాడు. నిధి వున్నదని గ్రహిస్తే మళ్లీ పేదరికం వుండదు. వాసనలు తొలగితే తప్ప మోక్షం లేదు. తానెవరో తెలుసుకోవాలి.

ఆత్మ స్వకంఠాభరణన్యాయానుసారంగా ఎల్లప్పుడూ ప్రాప్తమయ్యే వున్నది. దానిని మరచిపోయి దుఃఖిస్తున్నారు. అది గుర్తించితే దుఃఖం దూరమైపోతుంది. ఆత్మను మరచిపోవడానికి కారణం అవిద్య. అవిద్యానివృత్తికై ముముక్షువులు పాటు పడాలి. ఆత్మ సాక్షాత్కారానికై ఈ జీవితంలోనే పాటుపడాలి. మృత్యువు ఏ క్షణాన పైబడుతుందో తెలియదు. "న హి మృత్యుః ప్రతీక్షేతకృతం వాఽ ప్యథవాఽ కృతమ్"– నీవు ఏ పని చేశావో, ఏ పని చేయలేదో అందుకొఱకై మృత్యువు వేచి వుండదు. అందువల్ల అది రాకముందే మన పని మనం చక్కబెట్టుకోవాలి.

నిర్భయంగా వుండండి! 'Be Fearless' అనేదే శ్రీకృష్ణుని పరమబోధ.

శ్రీ సద్గురు మలయాళస్వాములవారు ఈ సభల ద్వారా జ్ఞానభిక్ష అనుగ్రహించారు. దానిని మనం సద్వినియోగం చేసుకోవాలి. ○○



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

2వ, లీల :- దేవీ! నిత్యము తమ్ముల నేను పూజించుచుంటిని. నాకు వర మొసంగుడు. నాపతి యుద్ధమున దేహమును త్యజించి యెటకేగునో నేనచట ఈ శరీరముతోనే ఆతని భార్యగా నుండునట్లనుగ్రహింపుడు.

సరస్వతీదేవి :- అట్లేయగుగాక! ఏలయన నీవు చాలాకాలము పుష్పధూపాదులతో నన్నర్చించి ప్రసన్న మొనర్చితివి.

1వ, లీల :-నన్ను పూర్వము స్థూలశరీరముతో గిరిగ్రామము నేల బొందింపకుంటివి?

సరస్వతీదేవి :- ఎవరు దేనిని వాంఛించుదురో దానిని ఆ యాప్రకారము పొందెదరు. నీవు పూర్వము ముక్తిని అభిలషించితివి. కావున దానినే పొందితివి. ఇతరమును గాదు.

2వ లీల:- మిమ్మెంతయోకాలమారాధించిన నా పతి విదూరథుఁడు అకస్మాత్తుగ ఈ రణమందేల జయించుటలేదు?

సరస్వతీదేవి:- శత్రువగు సింధురాజు జయముకొరకై నన్నారాధించి యుండెను. నీ పతి ముక్తికొరకారాధించెను. కాబట్టి అతడు దానిని బొందును. ఎవరెట్టి కోరిక కలిగి యారాధింతురో, వారట్టి ఫలము నవశ్యము పొందుదురు. నేనందరి హృదయములందును జ్ఞప్తి (చైతన్య) రూపమున నున్నాను.

ఈ ప్రకారముగ వారు ముగ్గురును సంభాషించుచుండ ఇరు సేనలును భీకరముగ పోరు సలుపుచుండెను. ఆ రాజులిరువురును రథారూఢులై ఒకరిపై నొకరు వివిధ శస్త్రాస్త్రములను బ్రయోగించుకొనుచు, తీవ్రముగ యుద్ధము చేయదొడంగిరి. తుదకు సింధురాజు తన ఖడ్గముచే విదూరథుని తొడను, మోకాళ్ళను విరుగగొట్టగా, ఆతడు రథముపై నుండి క్రిందపడి మూర్ఛిల్లెను. సారథి ఆతనిని రథముపై

నుంచి రాజభవనము వైపునకు బోవుచుండ మరల సింధురాజు విదూరథుని కంఠ ముపై ఖడ్గము విసరెను. సగము తెగిన కంఠముతోనున్న రాజును సారథి గొనిపోవు చుండ సింధురాజు వెన్నంటెను.

కానీ సరస్వతీదేవి యొక్క ప్రభావముచే నాతఁడు రాజభవనములోనికి పోజాలక వెడలిపోయెను. సారథి రాజు శరీరమును గృహములోనికి దెచ్చి మరణశయ్యపై సరస్వతీదేవి యెదుట నుంచెను. రాజు మరణించెనను వార్త రాజ్యమున వ్యాపింప ఎల్లెడల అశాంతి ప్రబలెను.కాని సింధురాజు వచ్చి తన కొమరుని రాజగద్దెపై గూర్చుం డబెట్టి ప్రజాపాలనమును ప్రారంభింపగనే తిరిగి యథా ప్రకారము శాంతి నెలకొనబడెను.

2వ లీల:— దేవీ! అయ్యో, నా పతి యిటు దేహమును త్యజింపబోవుచున్నాడు. (నాకు శోకము కలుగుచున్నది!)

సరస్వతీదేవి:— గొప్ప ఆరంభములతో గూడియున్నవైనను ఈ యుద్ధము, రాజ్యము మరియు ఈ దృశ్యము అంతయు మిథ్యయే; భ్రమ మాత్రమే. నీపతియగు విదూరథుని బ్రహ్మాండము పద్మని మృతశరీరమున్న అంతఃపురముయొక్క మండ పాకాశమున గలదు. అట్లే పద్మని బ్రహ్మాండము గిరి గ్రామ బ్రాహ్మణుని గృహాకాశమున గలదు. ఈ ప్రకారముగ, ఈ దృశ్యమంతయు స్వప్నమువలె భ్రమ మాత్రమే అయి యున్నది. ఆత్మయే త్రికాలములందును సత్యమైనది. దానియందీ దృశ్యమంతయు అజ్ఞానముచేఁ గల్పితమైనది. వాస్తవముగ ఈ దృశ్యము లేదు!

అటు పిమ్మట దేవియొక్క వరప్రసాదముచే ఆ 2వ లీల తచ్ఛరీరముతోనే తన కన్యతోగూడి అనేక లోకములను దాటి తుదకు పద్మని యంతఃపురమును జేరెను. కాని అట ఆ కన్య యెచటను గానరాకుండెను. తరువాత ప్రబుద్ధ లీల దేవిని మరణాంతర జీవస్థితిని వర్ణింపమని కోరగా దేవి ఇట్లు తెలిపెను.

శుద్ధాశుద్ధ కర్మాదులననుసరించి మనుజుని ఆయువునందు ఆధిక్యత, న్యూనత యేర్పడుచుండును. విషయసేవియగు మూర్ఖుడు మరణానంతరము అనేక భ్రమలను గాంచుచు, గొప్ప బాధ ననుభవించుచు దుఃఖితుడగును. జ్ఞానాభ్యాసిగాని, జ్ఞానిగాని అట్లు దుఃఖమునొందడు, కాని వాస్తవముగ చైతన్యమెన్నడును మరణించుటలేదు, జన్మించుట లేదు. పాపి పాపకర్మఫలమగు దుఃఖము ననుభవించి మరల నీచయోను లందు జనించును. పుణ్యకర్మలఁ జేయువారు స్వర్గాదుల ననుభవించి మరల మానవులుగ జనింతురు.

# వేదాంతభేరి శాశ్వత చందాదారులు
## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :-

శాశ్వత చందా రు. 300/-లు

---

1. శ్రీ జి. శేషగిరిరావు గారు - హైదరాబాద్
2. శ్రీ బి. శ్రీ కృష్ణారెడ్డి గారు - హిందూపూర్
3. శ్రీ పి. రాజశేఖర్ గారు - తిరుపతి
4. శ్రీ కె.ఆర్. వెంకట్ గారు - బొంబే
5. శ్రీ సి. వేంకటసుబ్బారావు గారు - ఎ.వి.నగరం (తూర్పుగోదావరి జిల్లా)
6. శ్రీ జి. మల్లయ్య మానుగ గారు - బొంబే
7. శ్రీ పి.వి.జి.కె. ప్రసాదరావు గారు - కైకారం
8. శ్రీ వి. రామమోహన్ గారు - చిన్నమండెం
9. శ్రీ పి. కైలాస్ గుప్త గారు - హైదరాబాద్
10. శ్రీ టి.పి. గుప్త గారు - మద్రాస్
11. శ్రీ ఎ.వి. భాస్కరరావు గారు - విజయనగరం
12. శ్రీ జె.బి. గుప్త గారు - బొంబే
13. శ్రీ భారత్ ఫ్రెండ్స్ - చీరాల
14. శ్రీ వి. రామనర్సయ్య గారు - హైదరాబాద్
15. శ్రీ జి.వి.బి.ఆర్. ప్రసాద్ గారు - ధర్మవరం
16. శ్రీ టి. అమృత్‌రాజ్ గారు - హైదరాబాద్
17. శ్రీ టి. నళిని గారు - హైదరాబాద్
18. శ్రీ కె. సుబ్రమణ్యం శెట్టి గారు - మద్రాస్
19. శ్రీ జి.కె. ప్రకాశ్ గారు - బెంగుళూరు
20. శ్రీమతి చోడే అన్నపూర్ణ గారు - కాకినాడ

OO





విజయవాడ వేద విశ్వవిద్యాలయ స్థాపకులు శ్రీ చిన్నజీయరు స్వాములవారు "వికాస తరంగిణి" అను పేరుతో ప్రత్యేక సమావేశము నొక దానిని ఏర్పాటుచేయుచు శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారిని ఆహ్వానించిరి.

వారి ఆహ్వానమును పురస్కరించుకొని శ్రీ స్వాములవారు విజయ వాడలో ఆ కార్యక్రమమునందు పాల్గొందురు.

సభాకార్యక్రమము–వికాస తరంగిణి

స్థాపకులు– శ్రీ శ్రీ శ్రీ చిన్నజీయరు స్వాములవారు

అధ్యక్షులు– శ్రీ జి.ఎస్. రాజు గారు
ప్రముఖ పారిశ్రామికవేత్త, SIRIS, విజయవాడ

ఉపన్యాసకులు శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారు

తేది– 22.11.1992

సమయము– సాయంకాలము 5 గంటలకు

స్థలము– జింఖానా గ్రౌండ్స్, విజయవాడ

శ్రీవారి విడిది– శ్రీ గెల్లి నరసింగరావు గారు
శైలజ థియేటర్ దగ్గర, హోటల్ జగపతి ఎదురుగా
గాంధీనగర్, విజయవాడ ఫోన్ : 77075

నవంబరు 22 నుండి 25 వరకు శ్రీవారు విజయవాడలో యుండి 26.11.92 నాటికి శ్రీ కాళహస్తి, శ్రీ శుకబ్రహ్మాశ్రమమును చేరుదురు.

## ఇప్పుడే వెలువడిన నూతన గ్రంథములు

## I శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారి జీవిత చరిత్ర

(కృష్ణా పుష్కర సందర్భమున విజయవాడలో ఆవిష్కరించబడిన గ్రంథములు)

1. "శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి జీవిత చరిత్ర"ను లోగడ శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారు క్లుప్తముగా వ్రాసియుండిరి.
2. ప్రస్తుతము శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు (తిరుపతి) సంవత్సర కాలము కృషిచేసి శ్రీవారి జీవిత చరిత్రను విపులంగా వివరంగా వ్రాసియున్నారు.
3. కృష్ణా పుష్కర సందర్భముగ విజయవాడలో శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ విద్యానందగిరిస్వాములవారు "శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాముల వారి జీవితచరిత్ర" గ్రంథమును ఆవిష్కరించిరి.
4. ఇందులోని ప్రత్యేక ఆకర్షణలు గల ఫోటోలు
   - ఎ. గురుదేవులైన సద్గురు శ్రీ మలయాళస్వాములవారితో శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు
   - బి. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారితో "
   - సి. శ్రీ గణపతి సచ్చిదానందస్వాములవారితో (మైసూరు) "
   - డి. శ్రీ చిన్మయానందస్వాములవారితో "
   - ఇ. శ్రీ డా॥ సాయికుమార్ (సికింద్రాబాద్) వారితో
   - ఎఫ్. శ్రీ మాతా సుశీలాదేవి గారితో "
   - జి. శ్రీవారికి గంగలో దొరికిన "భగవద్గీత"
   - హెచ్. శ్రీ స్వాములవారు నిర్వహించిన 108 గీతాయజ్ఞముల మరియు 55 గీతా మహోత్సవముల వివరములు;
   - ఐ. శ్రీ స్వాములవారి విద్యాభ్యాస, గురుకులవాస, సన్న్యాసాశ్రమ స్వీకారోత్సవముల వివరములు, శ్రీవారి బోధలు సదుపదేశములు కూడ ఇందు చేర్చబడినవి. 112 శీర్షికలతో చక్కగా చూడముచ్చటగా యున్నది ఈ "జీవితచరిత్ర" గ్రంథము.

పేజీలు – 300 వెల : రు.25/–

(ఎంతో కృషిచేసి శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారి జీవిత విశేషములను సేకరించి, సాంగోపాంగముగ, చక్కగ తేటతెలుగులో, అందరికీ అర్థమగు రీతిలో వ్రాసిన శ్రీ సముద్రాల లక్ష్మణయ్య గారు, M.A., సాహిత్య శిరోమణి, తిరుపతి అభినందనీయులు. వారికి మా ఆశ్రమము తరపున ధన్యావాదములు. ఇట్లు

ప్రకాశకులు)

## II దివ్యసూక్తులు

ఆశ్రమమును సందర్శించినవారు ఆశ్రమములో గోడలపై వ్రాసియున్న సూక్తులను చూచి "ఇవి చాల బాగున్నవి. వీటినన్నిటిని కలిపి ఏదైనా పుస్తకరూపముగ ముద్రించియున్నారా?" అని అడుగుచుండెడివారు.

భక్తుల కోరికపై ఆ సూక్తులను, శ్రీవారి సదుపదేశములను, మరికొన్ని మంచి వాక్యములను కలిపి 'దివ్యసూక్తులు' అను గ్రంథముగ ముద్రింపబడినది. ఈ గ్రంథమును శ్రీ జి.ఎస్. రాజు గారు (డైరెక్టర్–సిరీస్ కంపెని) విజయవాడలో ఆవిష్కరించిరి.

పేజీలు – 70 వెల : రు.7/–

## III వివేకానంద సింహనాదము (క్రొత్తది)

ఆధ్యాత్మిక ఉత్తేజము, ఉత్సాహము, ఉరకలు వేయించగల గంభీరవాక్కులు శ్రీ వివేకానందస్వామివారివి. వారి ఇంగ్లీషు పదజాలము అద్భుతము. వాటిలోని కొన్నిటిని ఏరి, తెలుగులోనికి అనువదించిరి శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారు. ఆంగ్లమూలము దాని తెలుగు అనువాదముగల ఈ గ్రంథమును టి.టి.డి. పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ శ్రీ డా॥ రావుల సూర్యనారాయణమూర్తి గారు ఆవిష్కరించిరి.

పేజీలు – 200 వెల : రు.16/–

## IV భగవద్గీత డైరీ – 1993

డైరీ అంటే ప్రతివారికి ఆసక్తి. అట్టి డైరీలో భగవద్గీతా శ్లోకములు వాటి అర్థము ముద్రించి గీతపై అందరికి ఆసక్తి అభిరుచి కలిగించాలనే సత్సంకల్పములో భగవద్గీతను 1993 డైరీ రూపముగ వెలువరించిన ఘనత శ్రీ జగదీశ్ పేపర్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్, విజయవాడ వారికి దక్కింది. వీరి ప్రెస్సునందే గీతా మకరందాది ఆశ్రమ గ్రంథములు ముద్రింపబడుచున్నవి. 'గీతా–1993 డైరీ'ని శ్రీ నిర్మలానందస్వాములవారు (తెనాలి) విడుదలచేసిరి.

పేజీలు –365 వెల : రూ.25/–

పై గ్రంథములు లభించు చోటు :
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి – 517 640 చిత్తూరు జిల్లా.

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**